"డాక్టర్ కోట్నీస్" నాటకంలో ఆత్రేయ "కోట్నీస్" పాత్ర నటించేవాడు ఆయన చైనీస్ భార్య "చింగ్‌లాన్" పాత్రను శ్రీమతి నిర్మల నటించింది ఆ నాటకం ఇప్పుడు మనకు దక్కకుండా పోయినా, అందులోని రెండు పాటలు మాత్రం — శ్రీమతి నిర్మల పుణ్యమా అని మనకు లభించాయి వీటిలో మొదటిది "చింగ్‌లాన్" సైనికులను ప్రబోధిస్తూ పాడేది, రెండోది డాక్టర్ కోట్నీస్ అంతిమ ఘడియల్లో భర్తనూ బిడ్డనూ ఉద్దేశించి ఆమె పాడే వేదనాగీతం — సం॥

## 1

పరసుఖమునకై బ్రతుకంతాను
హారతి పట్టే అనాథలారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

ప్రపంచమే ఒక ముళ్లకంపగా
బ్రతుకంటే ఒక రాతి రథముగా
లాగుచు లాగుచు, మూలిగి మూలిగి
శ్రమించి చచ్చే శ్రామికులారా!
ద్రవించిపోయే ధార్మికులారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

ఆకలి మంటలు జన్మహక్కుగా
చీకటి శోకము స్థిర చరాస్తిగా
ఆశలు లేక, ప్రాణము పోక
కృశించిపోయే కర్షకులారా!
నశించిపోయే మానవులారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

## 2

కలతలేని చిరుత నవ్వు
కదలియాడు కనులలోన
మెరసిపోయె సామ్య జగతి
హాయిగాను నిదురపో!
నిదురపో, నిదురపో!

నేటి వీర త్యాగఫలము
భావి యువక భాగ్యరేఖ
మరిచిపోదు చరిత నిన్ను
చల్లగాను నిదురపో!
నిదురపో! నిదురపో!

---